టి.డి.పి. ప్రజా వ్యతిరేక విధానాలపై

# కాంగ్రెస్ పార్టీ - సమర శంఖారావం

(Criticism against - Un democratic and Anti - People's Policies of Telugu Desam Party)



నవ సమాజ స్థాపనకు – మరో ఇందిరమ్మ "సోనియా"

గాంధీ – నెహ్రూ – శకానికి – మరల పునర్జన్మ "సోనియా"

వెనుకబడిన – జనావళికి – "వెలుగు రేఖ" సోనియా

లౌకిక – ప్రజాస్వామ్య – రాజ్యానికి – శక్తిదాత "సోనియా"

రాజీవ్ గాంధీ – ధర్మపత్ని – మహానేత "సోనియా"

అధోజగత్ సహోదరులకు – అభయ హస్తం "సోనియా"

[illegible]

[illegible]

[illegible]

[illegible]

Acc
3142

## టి.డి.పి. ప్రజా వ్యతిరేక విధానాలపై

# కాంగ్రేస్ పార్టి - సమర శంఖారావం

## తొలిపలుకు

టి.డి.పి. పాలనకు అర్థం-పరమార్థం- ప్రజాశ్రేయస్సు కాదు-అంతులేని సొంత లాభాల నార్జించుకొనజూచే స్వార్థపరత్వం. టి.డి.పి. ఆదరించి అందలం ఎక్కించేది ప్రజాధర్మాన్ని కాదు. స్వప్రయోజనాల్ని-సాధించుకొనే అవినీతిని టి.డి.పి. అనుదిన ప్రయత్నం, ప్రజాభ్యుదయం కాదు. పదవుల్ని ఎలా నిలబెట్టు కోవాలన్న తపన, ఆకాంక్ష.

ఏక వ్యక్తి నియంతృత్వ పాలనా విధానాలతో, ఏడేళ్లుగా రాష్ట్రాన్ని తమ చిత్తం వచ్చినట్లు పాలిస్తున్నారు. ఎన్నో ప్రజా వ్యతిరేక విధానాలు మరెన్నో పరిపాలనా వైఫల్యాలు అన్నీ అభివృద్ధి నిరోధక చర్యలే. ఇంకెన్నో తిరోగమన విధానాలు.

వీటినన్నింటిని బహు చక్కగ సరళమైన సాధారణ జనభాషలో, మన పార్టీ ప్రచార సభ్యులు, బహు గ్రంధకర్తలు, ప్రభుత్వ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్,ప్రజాకవి-వంగపండు అప్పలస్వామి గారు వివరించడం-ముదావహం- శుభావహం.

ఇందులో తలా తోకా లేని టి.డి.పి. పై సమర భేరిని మ్రోగించడమే గాక మన కాంగ్రెస్‌పార్టీ సిద్ధాంతం ఎంతటి పటిష్ఠమైనదో, ఉదహరించడం, ఎంతైనా హర్షనీయం, ప్రజాకవి వంగపండు గారిని మనసారా అభినందిస్తున్నాను.

ఇట్లు

**ధర్మాన ప్రసాదరావు**, M.L.A.

ప్రధాన కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ - కాంగ్రెస్ - కమిటీ

హైదరాబాద్

గాంధీభవన్

తే 10-02-2002ది

టి. డి. పి. ప్రజా వ్యతిరేక విధానాలపై

# కాంగ్రెస్ పార్టీ - సమర శంఖారావం


డా॥ Y.S.రాజశేఖర రెడ్డి

## అంకితం

మన పార్టీ శాసన సభా పక్షం నాయకులు
ప్రత్యర్థుల పాలిట సింహ స్వప్నం
ధీః ప్రజ్ఞా విశారదుడు
రాజకీయ విజ్ఞాన చతురుడు
మన ప్రియతమ కాంగ్రెస్ పార్టీ నాయకుడు
మన గౌరవ **రాజశేఖర రెడ్డి గారికి**

ఇట్లు
**ప్రజాకవి-వంగపండు**
పెందుర్తి, విశాఖపట్నం

---

## కృతజ్ఞతలు


ధర్మాన ప్రసాదరావు గారు

వంశధార నదీ తీరాన-ఉత్తరాంధ్ర గడ్డపై
జన్మించిన రైతుబిడ్డ
పోలిక రాచబిడ్డ
తిరగబడిన పులిబిడ్డ
మా బి.సి.లకు-వెలుగు కిరణం
మా పార్టీకి -ఆశా కిరణం
రాష్ట్ర మాజీ మంత్రి వర్యులు
నరసన్నపేట శాసన సభ్యులు
ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి- ప్రధాన కార్యదర్శి
గౌ॥ ధర్మాన ప్రసాదరావు గారికి కృతజ్ఞతలు

ఇట్లు
**ప్రజాకవి-వంగపండు**
పెందుర్తి, విశాఖపట్నం

# ప్రథమ భాగం

## టి.డి.పోడ - సెప్పకుర - సేతగాని పనులు
## కాంగ్రెసోడ్ని - నిలదీస్తా - కట్టి పెట్టు కబుర్లు

## వ్యవసాయ రంగం

పండించిన పంటలకు పడిపోయెను ధరవరలు
పంటలు సెల్లక - రైతు కంట నీరు నిడుతున్నడు
దిగుమతి సుంకాలు తగ్గి, విదేశాల బియ్యమొచ్చి,
స్వదేశీరైతోడికి చావు దెబ్బ తీసారు. ॥ టి.డి.పోడ॥

సాంప్రదాయ పరిపంటను సాగు చేయవద్దంట
మెట్టపంట వేస్తే, మనకు గిట్టుబాటు కాదు కద.
స్వదేశాన ధరలుండవు, విదేశాలు తీసికోవు.
గొఱ్ఱె-బఱ్ఱె- కోళ్లు పెంచి పూట బ్రతుకే బ్రతకాలి ॥ టి.డి.పోడ॥

అన్నదాత బతుకునకు కన్నం పెట్టేసారు
పాడిపంట రైతోడికి పళ్ళూడగొట్టేరు
మద్దతు ధర పలకదు, కనీస ధరకు గతిలేదు
రైతోడిని ఉసురు పెట్టి రాజ్యమేల తారమీరు. ॥ టి.డి.పోడ॥

మీపాలనలో - రైతుకి మిగిలిన దేమిటి బాబు!
సబ్సిడీల్ని తీసేసార్ బ్యాంకు -ఋణాల్ని ఆపేసార్!
మిగుల భూములను పంచరు రైతుకు -బంజర్లివ్వరు!
చిన్నసన్నకారురైతు! చిక్కుల్లో పడ్డాడు. ॥ టి.డి.పోడ॥

భూ సంస్కరణలనే మాట "నోటను" రానేరాదు
సాగుహక్కు్కఖాయ మనరు, కౌలుదార్ల రక్షణననరు
భూమిలేని రైతోడికి! బువ్వపెట్ట భూమివ్వరు.
పనిలేని కూలోడికి బ్రతుకు పెట్టె దారివ్వరు. ॥ టి.డి.పోద॥

ఎదగలేని ఎటుజూచిన చిన్నకారు రైతాంగం
దున్నగ నాగలి తిరగని, చిన్నచిన్న భూకమతాల్.
సాగు హక్కు! నూడదీసి రైతుల్ని బికార్లు చేసి.
కార్పోరేట్ వ్యవసాయం కాలుదువ్వుతున్నారు ॥ టి.డి.పోద॥

సంతకెళ్లి -కాయగూర లమ్ముకొని బతుకు తుంటే
వింతైని పేరుతో సంతలకు, రైతు బజార్లన్నారు
సప్లయి ఒకచోట చేర సరుకునకు గిరాకి లేక
కూరలమ్ము రైతోడి నోరు కొట్టినారు మీరు. ॥ టి.డి.పోద॥

విద్యుత్‌ను చౌకగ ప్రభుత్వమే ఇస్తుందని
రైతులు - వ్యావసాయక - పంపుసెట్ల కెగబడితే
రేటుపెంచి, కాటు వేయ - రైతోడికి
కష్టమొచ్చి నష్టపడ రైతన్నల ఆత్మహత్య. ॥ టి.డి.పోద॥

పాడిపంట వర్ధిల్లిన! ఫలితమేమి లేదు నేడు!
సరుకులో నాణ్యత లేదని! సర్కారోడు - తీసికోడు
స్థానిక ప్రజ వీటిని కొని అనుభవించే పసలేదు.
వరల్డుట్రేడ్ సంస్థకు! మనం వశమై పోయాం నేడు ॥ టి.డి.పోద॥

పుష్కలంగ-నదులున్నను! ప్రాజెక్టులు కట్టరు
వాటర్‌షెడ్ పథకాలని కప్పగంతులేస్తున్నరు
చిన్నినీటి వనరులతో ఉన్నభూమి తడవదుర
జలాల్ మనచుట్టునుండ అడుగునీటి "గుంటలేల" ॥ టి.డి.పోద॥

# పరిశ్రమల రంగం

పరిశ్రమలు పెట్టడం! మా పనేకాదు పొమ్మన్నరు
చిన్నిచితక పనులకు కాని పరక ఇస్తున్నరు
ఉత్పత్తిని చేయు పనుల ఊసే మీరెత్తరుకద
ఉత్తుత్తి పథకాలకు ఊపిరి పోస్తున్నారు. ॥ టి.డి.పోద॥

పల్లెల్లో వృత్తులన్ని పతనమై పోయావి
సాంప్రాదాయ వృత్తులన్ని! సతికిలపడిపోయావి,
దినంతీరకను ప్రజలు! దిక్కులేని, వారైరి
కూలాడిన-కుండాడును కూలివాని బ్రతుకింతె ॥ టి.డి.పోద॥

పరిహద్దులు చెరిపేసార్ రక్షణలను నిలిపేసార్
స్వదేశీయ గృహవృత్తులు సతికిల పడ్డాయికద
వర్ధమాన విదేశాల వర్తకులతో పోటీయా!
వస్తాదుతో- బక్కమనిషి కుస్తీ పట్టడమా! ॥ టి.డి.పోద॥

ముతక సరుకు ముతక పనుల ముచ్చటెలా వస్తుంది
సరుకు నాణ్యతకు మనకు ఆర్థికంగా పసలేదు
పనిచేసికుని బ్రతకమని పనిముట్లను ఇస్తారు
సృష్టించిన సరుకునకు గిరాకిని తెప్పించగలర ॥ టి.డి.పోద॥

గోచిపాత బ్రతుకులతో గుడిసెల్లో నివాసాలు
పల్లె పల్లెలో మనకు ప్రత్యక్ష మౌతాయి.
స్వర్ణాంధ్రకు వీరేనా సాక్షులుగ నిలుస్తారు
మట్టిబ్రతుకులుండగ మీ వట్టి గొప్పలెందుకుర ॥ టి.డి.పోద॥

పనిచేసిన మనబ్రతుకులు పక్కా అంటున్నారు.
దినమెల్ల పనిచేసిన దినం తీరలేదు బాబు.
శ్రమయేవ జయతే అని చెయ్యెత్తి చెపుతూ.
రంగు పూసి ఎన్నాళ్ళు రాజ్యమేలు తారుమీరు. ॥ టి.డి.పోడ॥

సంక్షేమ పనులకును ధరపట్టిక పెట్టేశార్
విద్య వైద్య సేవలకు విలువ కట్టి అమ్మేరు.
మూల్యం చెల్లిస్తేనే ముఖ్య సేవలన్నారు.
కొనగలిగిన వాడికే కోటి విద్యలీనాడు. ॥ టి.డి.పోడ॥

తల్లి దండ్రి వృత్తులపై పిల్లలకు గురిలేదు.
పరుల వృత్తి జేయవారు పరుగిడుతున్నారు నేడు.
తరతరాల నైపుణ్యం వృధా అయిపోతున్నది
గృహవృత్తులు గుణపాఠాలు గురి తప్పిపోతున్నవి. ॥ టి.డి.పోడ॥

ఉద్యోగం- చేయడమొక గొప్ప పోయిందినేడు.
సొంత వృత్తి చేయడమొక ముప్పైపోయింది నేడు.
గొప్ప సదువు సదవడమే తప్పైపోయింది నేడు.
గానుగెద్దు – జీవితమే ఘనమైపోయింది నేడు. ॥ టి.డి.పోడ॥

కష్టపడుతు బ్రతకాలని కలనైన కోరుకోడు.
పరులపైనబడి తినడం చాలపసందంటాడు.
సంక్షేమం జూచు ప్రభుత సంత బేరమెట్టింది.
పరిశ్రమలు ఎలా మనకు ప్రతి ఫలాల నిస్తాయి ॥ టి.డి.పోడ॥

# విద్యారంగం

ఉన్నత చదువుల సదవ ఎన్నెన్నో లాభాలని.
నోటి తోను సెబుతారు–నోసటి తోన వెక్కిరింపు.
తల్లి దండ్రి వృత్తిరాక- ప్రభుత ఇచ్చె పదవిలేక.
సదివినోళ్ళందరికి సాపాటుకి గతిలేదు ॥ టి.డి.పోడ॥

వళ్ళు గుళ్ళుచేసికొని తల్లి దండ్రి సదివిస్తే
పిల్లలంత పనులు లేక గోళ్లు గిల్లుకుంటున్నరు
విద్యలెన్నో నేర్చుకొని వీధుల పాలవుతున్నరు
పనులతో జతకూడని ఈ సదువు లెల్లదండగర. ॥ టి.డి.పోడ॥

సర్కారు బడులన్ని సరిగమ పదనిసలే.
అనాది కూడ తన బిడ్డను! ఆబడులకు అంపబోడు
పబ్లిక్ స్కూళ్లను ప్రభుత అదుపు చేయ తలపెట్టదు
సదువును"కొనుకుంటవే" తప్ప సదువులు రావాయేనాడు. ॥ టి.డి.పోడ॥

కాసులున్నవారి కెల్ల కంప్యూటర్ చదువులు.
పేదవాళ్ళ పిల్లలకు వీధి దుంపబడులు
పైసలున్న వారికే ప్రావీణ్యతగల సదువులు
చేతపైసలేని వాడి కీసడింపు చదువులే ॥ టి.డి.పోడ॥

పని చేస్తేనే తప్ప బ్రతుకునకర్థం లేదు
సదవకున్న జీవితానికి! పరమార్థం లేదుకద
పనివాళ్లని–చదువురులని పక్కా జేసేసారు
పని సదువులు సెప్పని ఈ పాఠాశాలలెందుకుర ॥ టి.డి.పోడ॥

బడులకు కమిటీలు వేసి  బడిపంతుల నిఘా పెట్టి
పాఠశాల విద్యల  పరమార్థం మార్చేసార్
గుణపాఠాల్ని నేర్పినోడు  గురువన్నది పోయింది
అచ్చరాలు మప్పినోడే అధ్యాపకుడయినాడు ॥ టి.డి.పోడ॥

పూజలందు బోధకునికి  పూటకూలిబత్తెమా!
బ్రతకడమే సమస్యయిన  బడి పంతులకేమి విలువ
తను విలువను గోల్పోయిన-తన బోధన లెవడు వినడు
బాధలలో మన గురువుల!  గాధ లెన్నోకదరా! ॥ టి.డి.పోడ॥

సంస్కార సభ్యతలకు!  సదువన్నది పోయింది
బతకడానికి సదువులు  బాగ బుర్రకెక్కింది
సాపాటుకి సామాన్యపు  సదువులు సరిపోతాయట
సంపన్నులు మేధస్సుకు  పదునులు పట్టాలంట ॥ టి.డి.పోడ॥

పదవ తరగతి వరకు ప్రతి ఒకరు చదవాలి
నిర్బంధంతో ఎల్లరు బడి విద్యను పొందాలి
చదువు-భృతి-పలక-పుల్ల సరిపెడితే-సరిపోదు
పేద-బీద-బిడ్డలకు తిండిపెట్ట సదువుతారు ॥ టి.డి.పోడ॥

దళితులు-బడుగులు!  బలహీనులు-నిర్భాగ్యులు
సంరక్షణ-మన బాధ్యత - రాజ్యాంగం చెప్పింది
వస్తూత్పత్తుల్ని పెంచ! వృత్తి కళాశాలలు
నైపుణ్యం, సామర్థ్యం  సానబట్టు వేదికలు ॥ టి.డి.పోడ॥

చరిత్రనే మరల వ్రాసి చదివిస్తారట వీరు
హస్తరేఖ అదృష్టంతో భవిష్యత్ బాగౌనట
నీ బాగుకు కర్త వీవె – "గీత"ను కాదనగలమా
చారిత్రక సత్యమిది, – చెరిపేస్తే పోదురా ॥ టి.డి.పోద॥

పరీక్షలో పాసయిన – ఫేలయిన – పరవాలేదంట ఇక
ఏ గ్రేడ్ బి గ్రేడ్ ఇస్తారట! విద్యార్థులకురితాడు
ఉద్యోగం ఇమ్మని ఇక ఏ ఒకడు అడుగలేడు
చదువులకే తిరుక్షవరం–అందరికి గుణపాఠం. ॥ టి.డి.పోద॥

కళాశాల విద్యలన్ని కనుమరుగై పోతున్నవి
పెట్టుబడి బడులకు పెద్ద పీట వేస్తున్నరు
వ్యాపార సంస్కృతికి అర్థం పడుతున్నారు
మానవ సంస్కృతిని – మంటగలుపుతున్నారు ॥ టి.డి.పోద॥

సతీష్ చంద్ర– థాపర్–మన అర్జున దేవ్ వ్రాసిన
చరిత్ర రచనలను – చెరిపేస్తామంటున్నరు
అశాస్త్రీయ విద్యలకు – అర్థం చెపుతున్నారు
గత భారత పరాజిత–అన! భయపడుతున్నారు. ॥ టి.డి.పోద॥

పనికొచ్చే సదువులకు – ప్రాధాన్యత అంటారు.
మాటల్లో మోతెక్కిన – చేతల్లో కనిపించదు
గదులలో కూర్చుండబెట్టి–గరిపె విద్య ఎందుకురా
పరిశ్రమిస్తూ – చదువుకొనే! పద్ధతి రావాలిర ॥ టి.డి.పోద॥

10

# ఉద్యోగ రంగం

శ్రమ జీవికి- మేదావికి - పనితనమొకటే బాబు
విభజన రేఖింటు గీసి విడదీసి చూపలేము
కాయకర్మ ఒకరిదైతే మనోయజ్ఞ మొకరిది
విడదీయగ జూచిన-ఏ ఒకటీ మనజాలదుర. ॥ టి.డి.పోడ॥

ఉద్యోగ వ్యవస్థనే ఊడగొట్టి పాతరేసి
కాంట్రాక్టు నౌకరికి పట్టం గట్టేరు మీరు
ఉద్యోగ భద్రత హుష్కాకి అయ్యింది
తుమ్మితే ఊడిపోయే ఉద్యోగాలొచ్చేసాయి ॥ టి.డి.పోడ॥

ప్రభుత్వ మన్న వండి వార్చి ప్రజలకింత
తిండి పెట్టె వంట కాల ఇళ్లు కాదన్నారు!
ప్రభుత్వం జేయు సేవలకు పైకం చెల్లించాలట
సొమ్ములు లేనోళ్ళంత సొమ్మసిల్లి పోతున్నరు ॥ టి.డి.పోడ॥

ప్రజలెన్నిన ప్రతినిధులకు పగ్గాలు వేసారు,
ప్రభుత్వాధికారులకు భజంత్రీలు వాయింపు
డెమొక్రసీ, బ్యూరోక్రసీ - డెమ్మిలై పోయావి.
ఏక వ్యక్తి పాలనకు ఎగబడుతున్నారు మీరు. ॥ టి.డి.పోడ॥

ప్రపంచ బ్యాంక్ షరతులకు సలాం చేసినోళ్ళు మీరు
ప్రభుత్వ సంస్థలను మార్కెట్లో అమ్మజూపుతున్నారు
ఉన్న ఉద్యోగులను! ఊడ బెరికి ఇంటి కంపి
ఉద్యోగనియామకాల! ఊసేవద్దన్నారు. ॥ టి.డి.పోడ॥

# పంచాయితీరాజ్

నిధులనెల్ల జన్మ భూమి కథలవైపు నడిపించి
జిల్లా పరిషత్‌లకు పళ్లాడ గొట్టారు
బదిలీలు - నియామకాలు బడ్జెట్ అనుమతులు
ప్రజల ప్రతినిధులనుండి అధికార్లకు చేరాయి ॥ టి.డి.పోడ॥

నోడల్ ఆఫీసర్లకు ఒదిగి ఒదిగి ఉండాలని
మండల పరిషత్తుల మండ సిద గ్గొట్టారు
ప్రజలెన్నిన ప్రెసిడెంట్‌ను ప్రక్కకు కూర్చొబెట్టి
అధ్యక్షస్థానమును ఆఫీసర కిచ్చారు ॥ టి.డి.పోడ॥

మండల కార్యలయాలు మరుగున పడిపోతుంటే
గ్రామ సచివాలయాల జెండా ఎగరేసారు.
ముంగిట్లో ప్రభుత్వం ముచ్చట తీరిందింక
నట్టింట పాలనకు నడుం గట్టి కదిలేరు ॥ టి.డి.పోడ॥

రెవెన్యూ మండలాల్ని రెవెన్యూ డివిజన్లను
ఎత్తివేయక తప్పని స్థితిలో మీరున్నారు
సచివాలయముండగ ఆఫీసులు దండుగని
రాష్ట్రం-జిల్లా-గ్రామం రంగంలో నిలిపారు. ॥ టి.డి.పోడ॥

సచివుడనగ మంత్రి ఆఫీసు అనగ ఆలయం.
సచివాలయమున సర్వత్ర కార్యదర్శి
పాలనంత కార్యదర్శి పై మెరుగే సర్పంచ్.
అగ్ర పీఠమధికారిది అనుమతి సర్పంచ్‌ది. ॥ టి.డి.పోడ॥

12

# ప్రైవేటు రంగం

పెట్టుబడుల మారాజుకి పెద్దపీట వేస్తున్నరు
ప్రైవేట్ సంస్థలకే ప్రాణం పోస్తున్నారు
ప్రభుత్వ రంగాన్ని ప్రక్కకు నెట్టేశారు
ఉద్యోగుల నూడదీసి ఉపాధిలేదు పొమ్మన్నరు ॥ టి.డి.పోద॥

పాఠశాల-వైద్యశాల అన్నీ ప్రైవేట్ పరం
పైసలున్న వారికే బహుమతులుగ ఇచ్చారు
పెట్టుబడి సొమ్ముంటే పరిశ్రమకు అధిపతి
సొమ్ములు చెల్లిస్తేనే సోషల్ సర్వీసులిక ॥ టి.డి.పోద॥

సర్కార్ సంస్థలన్ని సన్నగిల్లి పోతున్నవి
ఆఫీసుల్లో కొలువులు అరుదైపోతున్నవి
ఉపాధి కార్యలయాలు టపాలు కట్టేసాయి
ఎమ్మె ఎమ్మెస్ చదివిన, ఏ ఉపాది దొరకుదుర ॥ టి.డి.పోద॥

పరిశ్రమలో కార్మికునికి మరి భాగం లేదన్నరు
దినసరి బత్తెమె గతి దిక్కులేని కార్మికునికి.
ఇచ్చినంత పుచ్చుకొని చచ్చినట్లు సేవలు
ఘెరావ్‌లు, బంధులేవి జరగకూడదన్నారు ॥ టి.డి.పోద॥

వ్యవసాయ పరిశ్రమల వేగుచుక్క- విద్యుత్
కార్పోరేట్ కంపెనీకి కట్టబెట్టినారుకద
ఆర్టీసిని కూడ-వేటువేసి కాటు వేయ తలపెట్టిరి
చౌక ధరల దుకాణాల్ని లాభసాటిగను మార్చిరి. ॥ టి.డి.పోద॥

బహుళజాతి సంస్థలు మనబాగును కోరవుర.
మన పెరటిలో చెట్టునాటి పళ్ళుకోసుకుంటారు
విదేశీ పెట్టుబడులు స్వదేశాన ప్రవహిస్తే
స్వదేశీ పెట్టుబడి సప్పబడిపోతుంది. ॥ టి.డి.పోద॥

# పబ్లిక్ రంగం

వరల్డు బ్యాంక్‌తో మీరు ఒప్పందం చేసికొని
పబ్లిక్ రంగ సంస్థల్ని రద్దు చేయజూస్తున్నరు
ప్రజా పంపిణీ వ్యవస్థ పతనము కాబోతున్నది
స్వేచ్ఛా మార్కెట్ ఇక స్వైరవిహారం చూడర ॥ టి.డి.పోడ॥

పనిపాటులు కల్పించుట ప్రభుత్వం పనికాదట
దిన బత్తెం అప్పులిస్తె జనం బ్రతుకుతారంట
రోజుకో పథకమేసే మోజులోన పడ్డారు
ఉద్యోగాలివ్వలేము ఆ ఊసే వద్దన్నారు ॥ టి.డి.పోడ॥

ప్రభుత్వ ఫ్యాక్టరీల్ని అమ్మకానికిడుతున్నరు
లాభాల ప్రసక్తి లేని పనులే వద్దంటున్నరు
దళితులకు వెనుకబడిన తరగతులకు ఇక దిక్కేది
రాజ్యాంగం రక్షణలకు కాని కాలమొచ్చింది ॥ టి.డి.పోడ॥

బాండ్లు నమ్మి స్వదేశాన అప్పుజేసి విదేశాన
కోట్లు కొలది ఖర్చుచేసి తూతూ మంత్రం జరిపి
చిల్లర పథకాల క్రింద చెల్లుచీటి వ్రాస్తున్నరు
అప్పుల ఆంధ్రను స్వర్ణాంధ్రని చెపుతున్నారు ॥ టి.డి.పోడ॥

తెల్ల ఏనుగుల నెవడు మేపుతూ ఉంటాడని
ప్రభుత్వరంగ సంస్థలకూ పంగనామ మిడుతున్నరు
ప్రైవేటు రంగమే ప్రజలనుద్ధరిస్తుందని
లాభాలతో పనులను నడప జూస్తున్నారు ॥ టి.డి.పోడ॥

ప్రజలకు మేలుకూర్చు ప్రైవేట్ సంస్థలని
పబ్లిక్ రంగాన్ని పాతరేయ జూస్తున్నారు
వంట గ్యాస్ కిరోసిన్ కరెంటు చార్జి ఇంటిపన్ను
మధ్యతరగతి ప్రజకు మారణాయుధాలైనవి ॥ టి.డి.పోడ॥

# ప్రజా వ్యతిరేక విధానాలు

"ఇజం" అనేదే లేదని ధ్వజం ఎత్తిచెప్తుతారు
మీదీ ఒక ఇజమన్న నిజం మీరు మరచారు
కుడి ఎడముల భావాలకు ఎడం ఎడం అంటారు
పెట్టుబడుల పాలనకు పెద్దపీట వేస్తారు ॥ టి.డి.పోడ॥

సామ్యవాద సమసమాజ దరికి మీరు పోలేరు
సరిసమాన బ్రతుకులని గ్రహపాటున కూడ అనరు
పెట్టుబడులు ఉన్నవారే మీ కంటికి పెద్దలు
సొమ్ములున్న ఈ జగతికి బొమ్మదేవుడంటారు. ॥ టి.డి.పోడ॥

నీ పుట్టుక స్థలమది నీ జన్మభూమి కాదనము
పయిచోటను జన్మించిన జన్మభూమి ఏదగును
జాతిజనుల పుట్టుకలను జన్మభూమి తెలుపుర
మన జన్మభూమి – పుణ్యభూమి భరతభూమి కదర ॥ టి.డి.పోడ॥

"ఆత్మ" దైవమే అయిన "దైవం" ఆపరమాత్మే
ప్రజలే దేవుళ్ళన ఆపరమాత్మకు అపచారం
దేహమే దేవాలయం దేశప్రజలు కాలేరు
ఉపమానం బాగులేదు ఉదహరించ మానండి ॥ టి.డి.పోడ॥

ప్రజలందరు దేవుళ్ళని పలికిన సరిపోదుర
గుడులు లేక ఈదేవుళ్ళు గుడిసెలలో ఉన్నారు
తీర్థం ప్రసాదాలతో దినం గడుపుతున్నారు
భూరి నైవేద్యానికి మీరిచ్చేదేముంది ॥ టి.డి.పోడ॥

ఊరూర సభల జరిపి  ఉపన్యాసాలిస్తే
అస్పృశ్యత ఒక జాడ్యం  అంతలోన పోతుందా
చెపితే పోయేదైతే  ఇంతకాల ముంటుందా
చేతలలో నివారించ  చేయండిక ఏదైన  ॥ టి.డి.పోడ॥

రైతాంగం - బాగంటరు ప్రాజెక్టులు కట్టరేమి
శ్రమజీవికి తోడంటరు  పరిశ్రమలు పెట్టరేమి!
ఉత్తుత్తి పంపకాలు  ఊసుపోని పథకాలు.
పప్పు బెల్లాల్ని పంచ  పప్పులుడక బోవుర  ॥ టి.డి.పోడ॥

కొండమీద బండెడున్న తుంబలితో ఆదివాసి
మణులతో మైదానమున్న ఆది ఆంధ్రపేదరాసి
వనరులెన్నో ఉట్టిపడిన వెనుకబడిరి ప్రజలెల్లరు.
ఎవరు బాగుపడ్డారు  ట్రేడ్ మార్క్ చౌక్కాలే  ॥ టి.డి.పోడ॥

ఋణ మేళాల్ జరుపుతుంటే  జనాలొచ్చి పడుతున్నరు
ఇంటి స్థలాల్, పనిముట్లన ఎగబడి వస్తున్నరు
దినబత్తెం పనులివ్వగ  తిరునాళ్ళగ జనమొస్తరు
జన్మభూమి సక్సెస్ అని జబ్బచరుస్తున్నారు.  ॥ టి.డి.పోడ॥

ప్రపంచ బ్యాంక్ అప్పులే  ప్రచారంలో గొప్పలు
అదుపు తప్పె నిరుద్యోగమాకాశం అంటె ధరలు
కొత్త ఉద్యోగాలకు  నెత్తిన శఠగోపం
ఉన్న ఉద్యోగులలో- రెండుశాతం ఊష్టింగ్  ॥ టి.డి.పోడ॥

అర్ధశాతం జనాభా నేడర్ధాకాలితో ఉంది
సాంఘీక అసమానత్వం సర్వత్రా ప్రత్యక్షం
సంపన్నులపై పన్ను బడుగు ప్రజకు దన్ననరు
ప్రజలపైన పన్నువేసి ప్రగతినడ్డుకొంటున్నరు ॥ టి.డి.పోడ॥

శ్రమను అమ్మి బతుకినోడ్ని శ్రమదానం అడగాలా!
సంపన్నులనెల్ల పిలచి సహకరించ అడగండి
ప్రజలందరు జరుపుకొనే జన్మభూమి గొప్పదే!
అవకతవకలుంటేనే అడుగుతుంది కాంగ్రేసు ॥ టి.డి.పోడ॥

ఆదరణ పథకమును నిరాదరించు వారెవరు
పనిముట్లను పంచగ పసందు కానిదేముంది
గిరాకీ లేని వస్తువులు వృధా అగును చూడండి
ఇచ్చిన పనిముట్లకు నచ్చిరాని పనులెందుకు ॥ టి.డి.పోడ॥

పనికి బియ్యమివ్వగను పనికి రాదు అనగలమ
పక్కదార్లు పడితేనే ఒప్పుకోదు కాంగ్రేసు
బడుగుల సంక్షేమం అది బంతులాట కాదుర
కూడిస్తే సరిపోదుర కూలికూడ ఇవ్వాలి ॥ టి.డి.పోడ॥

అంత్యోదయ అన్నపూర్ణ వృద్యాప్యపు పింఛన్లు
మేంజేసిన ఘనకార్యాల్ కేంద్రం భాజా భజంత్రీ
మీ ఖాతాలో లేనివి మీరెందుకు చెపుతారు!
బలుపుకాదు మీది వట్టి వాపు అని తెలిసికోర ॥ టి.డి.పోడ॥

సాగునీటి సంఘాలని –సాధించిందేమిటిరా
లెక్కల గారిడి తప్ప – రొక్కమెవరు ఇచ్చారు
చెరువులకు కెనాల్స్‌కు – ఛైర్మెన్లు వెలసారు
మరమ్మత్తు పనులన్న – మజా మజా అంటారు || టి.డి.పోడ||

బిల్‌గేట్ – టోని బ్లయిర్ బిల్ క్లింటన్ వచ్చారు
ముఖ ప్రీతి కబుర్లు ముచ్చట్లే దక్కాయి
మన వడి నిండాలన – మనం శ్రమించాలిర.
దండుకోవడానికిదొక దైవ కార్యమటర || టి.డి.పోడ||

బీద పేద ప్రజలను ఆదుకోనగ అప్పులిచ్చె
బి.సీ. – కార్పోరేషన్ బెక బెక మంటున్నది
వెంట తిరిగి – అంటుకొని – కంటబడిన వారికే
విదలించినఆ అప్పులు–ఎడారిలో చినుకులుర || టి.డి.పోడ||

రాబడి ఇవ్వని పనులకు–అప్పు తెచ్చి పెట్టుబడుల!
జనాకర్ష పథకాలవి–అభివృద్ధికి అంచనాలా!
బతుకు పెట్టు"దారులకు" – అప్పు చేస్తే తప్పులేదు
చిల్లర పనులకు – అప్పు చిత్తై పోతాముర! || టి.డి.పోడ||

సంపన్నులపై పన్ను బలహీనులకదెదన్ను
ఆర్థిక నిపుణుల వాదన అక్కర్లేదంటారు
పలుకుబడి గలవారికి జడిసి మీరు తిరుగుతారు
అప్పు జేసి ప్రభుత్వాన్ని నడపాలని చూస్తున్నరు || టి.డి.పోడ||

బొట్టూ కాటుక పెట్టి - బ్రతిమలాడి పిలిచిన
బహుళజాతి సంస్థలిచటకురావటానికే జంకు.
కమ్యూనిష్టు చైనాలో కాలిడు తున్నవి జోరుగ
మన ఆర్థిక స్థితిని చూసి-రాను రాను పోఅన్నవి ॥ టి.డి.పోద॥

వస్తువు ధర నిర్ణయించు "మార్కెట్" యజమానంటవు
ఏ వస్తువు ధర ఎంత ఏలిన వాడవు సెప్పవు.
ఉన్నవాళ్ళు దినుసులను తన్నుకు పోతుంటే
లేనివాళ్ళకేమి దిక్కు ఏమీ కొనలేరుర. ॥ టి.డి.పోద॥

ఆదాయం-అయిన ఖర్చు-అంచనా "బడ్జెటో"ర
సీక్రేట్-బడ్జెట్ అని-జీరో బడ్జెట్ అని
జీరో బడ్జెట్ కాదు మారే బడ్జెట్ అంటున్నవ్
అన్నీ ప్రైవేట్ పరమె బడ్జెట్ ఇంకెందుకురా ॥ టి.డి.పోద॥

మూలపడిన-ప్రాజెక్టుల-ముక్తెపుడో చెప్పవు
నిరుద్యోగ యువతకు నీడను కల్పించవు
రెవెన్యూ లోటు నేడు వేలకోట్లు దశకు జేరె
విపరీతముగ అప్పుజేసి ఎవరి తలపై రుద్దుతావు ॥ టి.డి.పోద॥

# సంక్షేమ రంగం

సదివిన ఉద్యోగమేది-కష్ట పడుగ పని ఏది
హైటెక్ పాలనలో అన్నీ గారిడీ విద్యలే
జరుగుబాటు-పథకాలకు-జన్మనివ్వలేవు
జనాకర్ష పథకాలతో-జనాలేమి బాగుపడెను ॥ టి.డి.పోద॥

పెన్షన్లను ఇచ్చామన-రేషన్ కార్డిచ్చామన
ఇంటికి స్థలమిచ్చామన-ఇంటికి -ఋణ మిచ్చామన
మంచిదే - ఏమిస్తిరి- స్వశక్తి మీద నిలబడగ.
ఇస్తే పుచ్చుకొనే దౌర్భాగ్యం ఎప్పటికి పోతుందో ॥ టి.డి.పోద॥

కంప్యూటర్-సెంటర్లను-కార్పోరేట్ సంస్థలను
టూరిజం-హోటల్సను-మారిన అంగళ్ళను
పెట్టుకు బతకండని గట్టిగ సెపుతారు మీరు
పైసలేని వాళ్ళకు - ఎలా పెట్టుబడులు ఒస్తాయి ॥ టి.డి.పోద॥

పన్నులు విధిస్తునే, జల్ల కొట్టి వసూలు.
సబ్సిడీలు-తగ్గింపులు సంక్షేమ పనులుండవు
విద్యుత్ - చార్జీలమోత నీటి సాగు కొరత
బేషజాలు-తప్ప-మీరు జేసిందేమిటి బాబు. ॥ టి.డి.పోద॥

జనాభాలో సగం మంది -మహిళా మణులున్నారు
బాగ సదివి బాగు పడగ సలహాల నివ్వరు
ఏదో బ్రతుకు బ్రతకాలని - ఎందుకు సెపుతారు మీరు
గృహ వృత్తుల నేర్ప నీగుణపాఠాలెందుకురా ॥ టి.డి.పోద॥

ప్రజల తలసరి ఆదాయం-తాబేలు నత్తనడక
అధికారుల-ఆదాయం-కుందేలు కుప్పిగంతు
కష్టపడిన వారికి - కాసులు కరువయ్యేనుర
కూర్చున్నోడి కినేడు కుందులు దక్కేనురా! ॥ టి.డి.పోద॥

# ద్వితీయ భాగం

## కాంగ్రెసోడ్ని -సెపుతా -మేం -సాధించేదేమిటో
## టి.డి.పోడ - వినర - మా- విధం తెలిసికోర

### వ్యవసాయ రంగం

పట్టా భూముల్లేక జమీందార్ల పాలబడి
దిశ మొలరై తోళ్లంత దిక్కు లేక విలపిస్తె
జమీందార్లనెదిరించి రద్దు పరిచె విధానాన్ని
రైతే రాజని చెప్పి రాజ్యమేలే కాంగ్రెస్ ర ॥ కాంగ్రెసోడ్ని॥

బుగతలు భూస్వాములను తొలగించెను కాంగ్రెస్‌ర
ఇనాం భూములన్నింటిని ఇప్పించిన కాంగ్రెస్‌ర
సాగు హక్కు రైతుదని చాటెను కాంగ్రెస్‌ర
రైతాంగం -రక్షణకు విప్లవించె కాంగ్రెస్‌ర ॥ కాంగ్రెసోడ్ని॥

విదేశాల తాకిడికి వేసినాము అడ్డుకట్ట
స్వదేశీ పరిశ్రమకు రక్షణ కల్పించాము
పండించిన పంటలకు ధరలొచ్చేలా చేసి
పాడి పంట రైతోడికి పట్టం గట్టేము మేము ॥ కాంగ్రెసోడ్ని॥

వ్యవసాయ పంటలకు సబ్సిడీలనిచ్చాము
బాంకు ఋణాలను రైతుల కిప్పించాము
సన్నకారు రైతుకు దున్నగ భూములనిచ్చాం
రైతోడికి బక్కబండి బ్రతక గాను ఇచ్చాము ॥కాంగ్రెసోడ్ని॥

రాజుల భరణాలను రద్దు చేసె కాంగ్రెస్‌ర
బ్యాంకుల జాతీయం అది కాంగ్రెస్ ఘనకార్యముర
భూ సంస్కరణల్ని చేసి భూములన్నీ పంచాము
బడుగులకు కాలనీల్ని కట్టించెను కాంగ్రెస్‌ర ॥ కాంగ్రెసోడ్ని॥

పనిచేసిన కార్మికునికి బ్రతుకుదారి పెట్టాము
తగిన ధరలు -పంటలకు మద్దతు ధర నిచ్చాము
చేతి మదుపు దండిగను నిచ్చినదే కాంగ్రెస్‌ర
అన్నదాత రైతన్నను ఆదుకొన్నదెవరురా ॥ కాంగ్రెసోడ్ని॥

# పరిశ్రమల రంగం

నాగార్జున సాగరానికి - నాందీ కర్తలు ఎవరు
నదులకానకట్లు కట్టె - ఘన యసస్సు మాదేర
పంచవర్ష ప్రణాళికల కర్తలం మేమేర
వ్యవసాయం విద్యుత్తుకి - వన్నెతెచ్చినది మేమే ॥ కాంగ్రేసోడ్ని॥

సామ్యవాద సాధనకై సంస్కరణల కాంగ్రేసర
పబ్లిక్ సంస్థలకెల్ల ప్రాణం పోసేను కాంగ్రేసర
కలిమిలేని జనాలకు కల్పతరువు కాంగ్రేసర
సంక్షేమ రాజ్యానికి సారధి మా కాంగ్రేసర ॥ కాంగ్రేసోడ్ని॥

ఇరువది సూత్రాల పథకమెంతైన విలువ గలది
ఇందిరమ్మ దేశానికి ఇచ్చిన రక్షణ కవచం
బడుగులు బలహీనులు దళితులెల్ల బాగుపడగ
సమసమాజ సాధనకు మార్గదర్శి కాంగ్రేసర ॥ కాంగ్రేసోడ్ని॥

ఇళ్లకు స్థలాలనిచ్చి ఇల్లు కట్ట డబ్బులిచ్చె
కాలనీల్ని కట్టించిన ఖ్యాతి కలది కాంగ్రేసర
చిన్న పరిశ్రమలకు ఎన్నెన్నోరాయితీలు
సాంప్రదాయ వృత్తులను సంరక్షించిన కాంగ్రేస్ ॥ కాంగ్రేసోడ్ని॥

బ్యాంకుల్ని ప్రజల పరం చేసినదే-కాంగ్రేసర
ప్రతి ఒకరికి అప్పు దొరికే అవకాశమిప్పించెను
చేత పైసలేనోళ్ళుకు చేనేత పనివాళ్ళుకు
పుష్కలంగ ఋణాలిచ్చి పుంజుకునేలా చేసే. ॥ కాంగ్రేసోడ్ని॥

పురాతన వ్యవసాయం పుంజుకొని నిలబడగ
ఆధారిత గృహవృత్తుల కాధారం కాంగ్రేసర.
పల్లె పల్లె ప్రతిచోట పనులెన్నో దొరికేవి
కష్టజీవులపాలిట కలిమి బలిమి కాంగ్రేసర ॥ కాంగ్రేసోడ్ని॥

22

# విద్యారంగం

సదివినోళ్ల కెల్లనాడు సక్కనైన ఉద్యోగాల్
ఎక్కడకు వెళ్ళిన ఎన్నెన్నో గౌరవాలు
కారు చీకటిలో నాడు కాంతి రేఖ కాంగ్రేసర
తిమిరంతో సమరం కడు ధైర్యశాలి కాంగ్రేసర ॥ కాంగ్రేసోడ్ని॥

ఎంత సదువు సదివితే అంత పెద్ద ఉద్యోగం
సంస్కార సభ్యతలకు సాక్షిగ నిలచేవారు
పంతుళ్ళకు ఆనాడు ఎంతెంతో గౌరవం
మంచి వేతనాలతో మనుగడ సాగించేరు ॥ కాంగ్రేసోడ్ని॥

గురువులన్న భయభక్తులు ఉండేవానాడు
సదువు సెప్పినోళ్ళకు సాష్టాంగపు దండాలు
మార్గ దర్శకులైవారు మంచి పనులు చేసేరు
బతకడం కాదు గొప్ప బాగ సదివితే గొప్ప ॥ కాంగ్రేసోడ్ని॥

చదువబ్బని వాళ్ళకు సాపాటుకు గృహవృత్తి
సదువొచ్చిన వారిని, పై చదువులు కంపేరు
ప్రతిభసామర్థ్యమున్న ప్రతిచోట గౌరవమే
విద్యలొస్తే–గద్దలపై పెద్దలగ నిలిపేరు ॥ కాంగ్రేసోడ్ని॥

వెర్రి మొర్రి వేషాలు వెలలేని తిక్కపనులు
మీ పాలన చదువులకు, అడ్డం పడుతుంటాయి
మీ దశాబ్దపాలనలో మిన్ను ముట్టె కన్ను చెదరె
అవలక్షణ అసమర్థత అడుగడుగున కన్పిస్తాయి ॥ కాంగ్రేసోడ్ని॥

# ఉద్యోగ రంగం

పని విభజన మా నాడు కడుచక్కగ ఉండేది
అర్హత మేరకు పని ప్రతి ఒక్కరికి అమిరేది
గొంతెమ్మ కోర్కెలతో గోలపెట్ట లేదెవరు
కాంగ్రెస్ పాలనలో ప్రజలు కోర్కె తీరేది ॥ కాంగ్రేసోడ్ని॥

ఊళ్ళనుద్ధరించేవిగ ఉద్యోగాలుండేవి
సర్కార్ ఉద్యోగికి చక్కని రక్షణలు
ఉద్యోగ భద్రతకు లోటు లేదు ఏనాడు
సాధారణ ప్రజలకు సవాలక్ష బ్రతుకుదార్లు ॥ కాంగ్రేసోడ్ని॥

ధర్మాసుపత్రు లెన్నో ప్రతీచోట దర్శనం
చక్కని పాఠశాల లెక్కడైన ఉండేవి
మూల్యం చెల్లించకనే ముఖ్య సేవలందేవి
ప్రభుత్వాఫీసులు ప్రజా సేవ కేంద్రాలే ॥ కాంగ్రేసోడ్ని॥

వళ్లొంచి పనిచేసిన కూడు నీడ దొరికేవి
పిల్లా పాపలతో ప్రజలు సల్లగ బ్రతికేవారు
చదివినోళ్ళు అందరికి చక్కనైన ఉద్యోగాలు
కాళ్లు చేతులుండగ కరువెక్కడదనేవారు ॥ కాంగ్రేసోడ్ని॥

సంపాదన కోసమే సదువన్నది నాడు లేదు
సంఘంలో మెప్పు గొప్ప సాధించే వారు
ఇంజనీర్లు-డాక్టర్లు -లెక్చరర్లు-అధికారులు
సంఘసేవ జేయువారు సతతం - కోరేవారు ॥ కాంగ్రేసోడ్ని॥

"నల్ల ధనం" - కూడేసిన నలుగురు తిట్టేవారు
నల్ల బజార్ చేసిన-నలుగురు పొమ్మనేవారు
ధనవంతుల కానాడు ఘన సన్మానాల్లేవు
ప్రజల సేవజేసినోళ్లు పూజలనందేవారు ॥ కాంగ్రేసోడ్ని॥

# పంచాయితీ రాజ్ పాలన

వయసూ-విజ్ఞానం అనుభవ ముంటేనే
పెద్దతనం-ఆనాడు ప్రతి ఒకరికి దక్కేది
పదుగురి మెచ్చిన నాడు పెద్దతనం వచ్చేది
పైసలున్న వాడేనేడు పల్లెకు మారాజుకద. ॥ కాంగ్రేసోడ్ని॥

అతిగ ఆర్జించినోళ్ళు అక్కరకు రానివాళ్ళే
పేదయిన- నీతిపరుని-పెన్నిధిగ జూసేరు
జబర్దస్తి-చేసినోడే జనాలలో నేడు పెద్ద
నవ్వుతూ బ్రతకినోడే నలుగురిలో నాడు గొప్ప ॥ కాంగ్రేసోడ్ని॥

ప్రజాస్వామ్య రాజ్యానికి పంచాయితీ పెద్దమనిషి
మూడంచెల పంచాయితీ ముచ్చటగ నిలచింది
మెహత కమిటీ రిపోర్టు మా నెహ్రూజీ కారకుడు
స్థానిక నాయకుల ప్రభ తారక స్థాయికి చేరె ॥ కాంగ్రేసోడ్ని॥

ప్రెసిడెంటే గ్రామానికి పెద్ద మనిషి ఆనాడు
తగవుల తీర్పరిగ పల్లె ప్రజల సహాయకుడు.
ఛైర్మన్ జిల్లా పరిషత్ తిరుగులేని అధికారి
పదిమంది మెచ్చేదిగ ప్రజాపాలనుండేది. ॥ కాంగ్రేసోడ్ని॥

ఎన్నికయిన ప్రతినిధులే నిజమగు పాలకులు నాడు
నియమించిన ఆఫీసర్ కేమిలేదు అధికారం
జిల్లా గ్రామాం -సమితిలో ఎల్లెడల ఎటనైనను
అధికారం జన ప్రతినిధి హస్తంలో ఉండేది ॥ కాంగ్రేసోడ్ని॥

# ప్రైవేట్ రంగం

ప్రైవేట్ సంస్థలకు "పెద్దపీట" వేయలేదు
పబ్లిక్ రంగ సంస్థల్ని "రాజుగాను" చేయలేదు
సమతూకపు ప్రాతినిధ్య సమభావం నెరిపేది
మిశ్రమ ఆర్థిక రీతికి మేలుకొలిపే మా కాంగ్రేస్ ॥ కాంగ్రేసోడ్ని॥

బడి-గుడి-ఆసుపత్రి-పరిశ్రమలు సంస్థలు ఏవైన
ప్రైవేట్ పబ్లిక్ రంగాల్ సమపాళ్లలో నిర్వహణ
బడుగుల బలహీనులకు పబ్లిక్ సంస్థల సేవలు
వ్యక్తి ప్రతిభ రాణించగ ప్రైవేట్ రంగసంస్థలు ॥ కాంగ్రేసోడ్ని॥

రైతునుద్ధరించ - కార్మికులను బాగుపరచ
వ్యవసాయం - విద్యుశ్చక్తి ప్రభుతాధీనములైన
రైతులకు రక్షణలు శ్రామికులకు శిక్షణలు
ప్రైవేటు రంగం - పాలబడిన - పాడైపోతామురా ॥ కాంగ్రేసోడ్ని॥

విదేశీ కంపెనీల్ని కట్టడి చేసెను కాంగ్రేస్
స్వదేశీ సంస్థలకే "స్వర్ణయుగం" మానాడు
ప్రభుత అదుపు ఆజ్ఞలో ప్రైవేట్ సంస్థలుండేవి
సంక్షేమ పనులకు ప్రభుత్వ సంస్థలుండేవి ॥ కాంగ్రేసోడ్ని॥

# పబ్లిక్ రంగం

పై చేయి ప్రతిభదే అన "స్వేచ్ఛా మార్కెట్" అగును
బలహీనుడు దోపిడికి బలియై పోతాడు
"మార్కెట్ నియంత్ర"ణే మంచిదనీ చెప్పిన
వ్యక్తి చొరవ ఉత్సాహం – ఒక్కమారు సన్నగిల్లు ॥ కాంగ్రేసోడ్ని॥

మధ్యే మార్గానుసారి –మాకాంగ్రేస్ సిద్ధాంతం
కొనుశక్తి లేనోళ్ళకు కొంగుబంగారమొకటి
వ్యక్తుల ఉత్సాహానికి – ఊపిరినిచ్చును ఒకటి
పబ్లిక్–ప్రైవేట్–కలిసిన ప్రగతి మార్గదాయకాలు ॥ కాంగ్రేసోడ్ని॥

పెట్టుబడి సమాజమొద్దు సమసమాజమసలేవద్దు
సామ్యవాద తరహా సమాజమే మన గమ్యం
నెహ్రూ సోషలిజమే దేశానికి దిక్కుమొక్కు
పబ్లిక్ ప్రైవేట్ సంస్థ సరిసమాన ప్రగతి కారకాలురా ॥ కాంగ్రేసోడ్ని॥

ఆర్థిక సంస్కరణలు కాంగ్రేసువే కాంతినిచ్చు
సకల జనుల సౌభాగ్యపు సాధనాలురా ఇవి.
సంస్కరణల పేరు చెప్పి సకల జనుల కడుపుకొట్టు
పెద్దోళ్ళను పెద్దచేయు పధకాలొద్దురా మనకు ॥ కాంగ్రేసోడ్ని॥

పబ్లిక్ రంగ సంస్థలు పనికిరానివన కుదరదు
నవబారత నిర్మాతలు "నవరత్నా"లేకదర
అభ్యుదయం – అభివృద్ధికి ఆలవాలమైనవి
పంచవర్ష ప్రణాళికల ప్రగతి దాతలవిర. ॥ కాంగ్రేసోడ్ని॥

# సామ్యవాద-తరహా-సమాజ నిర్మాణం

(Formation of Socialist Pattern of Society)

సామ్యవాద తరహా సమసమాజ నిర్మాణం
"ఆవడి" కాంగ్రెస్ లోనే అవతరించే "తీర్మానం"
నెహ్రూజీ దేశానికి ఇచ్చిన ఆర్థిక వరమిది
మిశ్రమ ఆర్థిక వ్యవస్థే మేలని చెప్పెను కాంగ్రెస్ ॥ కాంగ్రెసోడ్ని॥

"స్వేచ్ఛా విపణి"-అంటూ వీరంగం చేయమురా
"మార్కెట్ కంట్రోల్" అని-మరీ రెచ్చిపోమురా
అటు అమెరికా - ఇటు రష్యా ఎటు వైపు వెళ్ళక
"పాంచమడీ" తీర్మానం-నా పరమావిధి ॥ కాంగ్రెసోడ్ని॥

ప్రతిభను సమర్థతను- పెంచ ప్రైవేట్ సంస్థలు
బలహీనులు-బాగుపడగ పబ్లిక్ రంగ సంస్థలు
వ్యక్తి-చొరవ-స్వాతంత్ర్యం - వ్యక్తం చేయగ నొకటి
సాంఘీక సంక్షేమ రాజ్య సాధనకు వేరొకటి. ॥ కాంగ్రెసోడ్ని॥

పంచవర్ష ప్రణాళికల ప్రాతిపదిక కాంగ్రెసురా
పంచాయితీ పాలనను ప్రవేశ పెట్టె కాంగ్రెసురా
చౌకధరల దుకాణాలను తెరచినదే కాంగ్రెసురా
బలహీనులు-కాలనీల్ని కట్టించినదే కాంగ్రెస్ ॥ కాంగ్రెసోడ్ని॥

సామ్యవాద సిద్ధాంతం-కాదంటే కదలిపోదు
పెట్టుబడుల సిద్ధాంతం-వద్దంటే వదలిపోదు
పెట్టుబడికి సమాజం - పెట్టుబడుల సమాజం
వాగార్థాలవలే, ఒకటినొకటి విడివడవ్వురా ॥ కాంగ్రెసోడ్ని॥

ఏ ఒక సిద్ధాంతంవైపు - వెళ్లదురా - మా పార్టీ
రెండింటినైక్యపరచ రాజ్యమేలు మాపార్టీ
ఉమ్మడి సౌభాగ్యాలకు ఊతగ-ఒకటుంటుంది
వ్యక్తిగత సౌభాగ్యం వన్నె తెచ్చునొకటిరా ॥ కాంగ్రెసోడ్ని॥

ఎవరి సొద వాడిదైతే ఎందుకు ఈ ప్రభుత్వాలు
ప్రజలనుద్ధరించేవే ప్రజా ప్రభుత్వాలుర
ప్రతి ఒకరికి ఉపాదిని ప్రభుత్వమే చూపాలి
"పని హక్కును" కల్పించుటె ప్రజా స్వామ్యలక్షణం ॥ కాంగ్రేసోడ్ని॥

అట్టడుగు జనాలకు పుట్టెడి ఆశలు నింపెను
సందేహామేలేదిందులో "పాంచమడి" సదస్సే!
చిన్నకారు రైతాంగానికి దున్నగ భూముల పంపిణి
కార్మిక జనులె - ల్లరికి సబ్సిడీలు రాయితీలు ॥ కాంగ్రేసోడ్ని॥

బ్యాంకుల జాతీయం ప్రజలకు భాగస్వామ్యం
భుక్తినివ్వ రైతులకు భూసంస్కరణల చట్టం
రాజులకు భరణాలను రద్దు పరచే కాంగ్రెస్
సామ్యవాద సమ సమాజ స్థాపననే ధ్యేయముర ॥ కాంగ్రేసోడ్ని॥

లౌకిక వాదానికి ఊతనిచ్చె కాంగ్రేసర
ప్రజాభిప్రాయనికి - ప్రతిబింబం కాంగ్రేసర
దళిత జనుల సౌభాగ్యంప్రాతిపదిక కాంగ్రేసర
సాంఘీక సంక్షేమానికి సారధి మా కాంగ్రేసర ॥ కాంగ్రేసోడ్ని॥

టి.డీ.పి.నరి కట్టును తిరుగులేదు **"మా సోనియా."**
టి.డీ.పి. నిద్రమత్తు వదలించును **"మా యమ్మెస్."**
టి.డీ.పి. మద గజాని కంకుశం **"మా రెడ్డి."**
టి.డీ.పి. ఆటలింక సాగవనె **"మా ధర్మాన."**

**ప్రజా కవి - వంగ పండు**

పెందుర్తి
విశాఖపట్టణం
ఆంధ్రప్రదేశ్



కాంగ్రెస్ పార్టీ అధినేతలతో

**ప్రజాకవి - వంగపండు**